


# అవతార మీమాంస

"కళాప్రపూర్ణ" వేదవేదాంగ పారంగత్, దర్శనతత్వవేత్త

డా. పం. గోపదేవ్

ప్రకాశకులు :
ఆర్యసమాజము,
కూచిపూడి - 522 313

6/-



"కళాప్రపూర్ణ" వేదవేదాంగ పారంగత్, దర్శనతత్త్వవేత్త

**డా. పం. గోపదేవ్**



# అవతార మీమాంస



"కళాప్రపూర్ణ", వేదవేదాంగ పారంగత్, దర్శనతత్వవేత్త

డా. పం. గోపదేవ్

ప్రకాశకులు :

ఆర్యసమాజము, కూచిపూడి - 522 313

ఓమ్

# అవతార మీమాంస

హిందువులు రామకృష్ణాదుల నీశ్వరావతారములని యెంచుచున్నారు. క్రైస్తవులు 'ఏసు'ను దేవుని యవతారమందురు. ఇట్లే యితర జాతులును భిన్నభిన్న - ఈశ్వరావతారములయందు విశ్వాసముకలవారై యున్నారు. మహమ్మదీయులు మహమ్మదు నీశ్వరావతార మనకున్నను ఈశ్వర సందేశహారుడు (రసూల్ పైగంబర్) అని యెంచుచున్నారు. అనేక జాతులం దీశ్వరపుత్రులు ప్రసిద్ధినొంది యుండిరి. 'సికందర్' ఈశ్వరుని పుత్రుడని పిలువబడెను.

హిందువులొకచో పదియవతారములను, కొండొకచో నిరువది నాలుగవతారములను పేర్కొనుచున్నారు. శైవులేబది మూడవతారములని చెప్పుచున్నారు. అందు శ్రీరామచంద్రుడు ద్వాదశకళలతో నవతరించెను. శ్రీకృష్ణుడు షోడశకళాపరిపూర్ణుడు. ఇతరావతారములు నిట్లే భిన్నభిన్న కళలు గలవిగా వర్ణింపబడెను.

ప్రస్తుతమున కొందరు విద్యావంతులు అవతారముల నాధారముగాగొని వికాసవాదమును సిద్ధపరచుటకై యత్నించుటను మనము జూచుచున్నాము. మత్స్య కచ్ఛప వరాహాద్యవతారములు క్రమముగా వికాసవాదమున వర్ణించిన భిన్న భిన్న శ్రేణులని వారియభిప్రాయము. డార్విన్ మహోదయుడు సృష్టి నిర్మాణమున వర్ణించినట్లే మత్స్యాద్యవతారములందు వికాసము దృష్టిగోచర మగుచున్నదని వారియుద్దేశము.

అవతారమును సిద్ధింపజేయుట కొసంగబడు యుక్తులను తిలకించినపుడు ఈశ్వరుని యవతార విషయమున జనులవిచారములనిశ్చి

తములని తెలియును. అవతారములందు విశ్వాసముగలవారేవిధము ననైన, అవతార సిద్ధాంతము లోకమున స్థిరమైయుండవలయునని యెంచుచున్నట్లు తోచును.

అవతారశబ్దము 'అవ' ఉపసర్గ పూర్వక 'తౄ' ధాతువువలన నేర్పడుచున్నది. దిగుట-లేక క్రిందికి వచ్చుట-అని దీనియర్థము. ఈశ్వరావతారమునకు, నిరాకారుడైన యీశ్వరుడు శరీరమునందవ తరించుటయని యర్థము. అనగా నీశ్వరుడు శరీరధారణ మొనర్చు నని తాత్పర్యము. ఈ విషయమున నీక్రింది ప్రశ్నలు వొడముట స్వాభావికము.

1) ఈశ్వరు డెట్టివాడు?

2) ఈశ్వర గుణములు మారునా?

3) ఈశ్వర గుణములను పరీక్షించిన అవతార మవసరమని తోచునా?

4) ఈశ్వరు డవతరించుట సంభవమా?

5) రామ కృష్ణాదులందు, వారిని మానవులనక ఈశ్వరావతారము లని యన దగువిశేషము లేమున్నవి?

6) ఈశ్వరు డవతరించునని యొప్పుకొనుటవలన మానవ జీవనము నకు కలుగు లాభమేమి?

7) వేదములందు రామ కృష్ణాద్యవతారముల వర్ణనలున్నవా?

1) ఈశ్వరుడెట్టివాడు? ఆస్తికులెల్లరు నీశ్వరుని జగత్కర్తయని స్వీక రింతురు. ఈశ్వరుడు పిపీలికాది బ్రహ్మపర్యంత మగు జగ త్తును రక్షించుచున్నాడు. పోషించుచున్నాడు. లయ మొన రించు చున్నాడు. అనగా సృష్టి స్థితి లయముల కతడు కర్త యని భావము. వేదాంత దర్శనమున వ్యాస మహర్షియునిట్లు సూత్రించి యున్నాడు.

"జన్మాద్యస్యయతః" 1-1-8 బ్రహ్మసూత్రములు..

జగమును సృష్టించి పోషించి లయము చేయువాడీశ్వరుడని సూత్రార్థము. దీనింబట్టి ఈశ్వరుడు అత్యంత సూక్ష్ముడనియు నిరాకారుడనియు బోధపడుచున్నది. అందువలననే యొకచో "అణో రణీయాన్ మహతో మహీయాన్" అని యీశ్వర విషయమున వర్ణింప బడియున్నది. స్థూలవస్తువు అతిసూక్ష్మవస్తువును నిర్మింప నసమ ర్థమగును. అత్యల్పములయిన బంగారు నగలు సమ్మెటచే నిర్మింప నశక్యములగును. నగలెంత సూక్ష్మములో సాధనములు నంతకంటే సూక్ష్మములై యుండవలెను. స్థూల వస్తువునందు సూక్ష్మవస్తువు ప్రవేశింప గలదు గాని, సూక్ష్మవస్తువునందు స్థూలము ప్రవేశింప నేరదు. ఈశ్వర నిర్మాణమునవెంత సూక్ష్మ పదార్థములున్నవో గమనించుడు ! చీమకంటె పెక్కుమడుంగులు సూక్ష్మ ప్రాణులు ప్రపంచమున నున్నవి. వాని శరీరములందు వందలకొలది యవ యవ ములును గలవు. వానిని మనము భూతద్దముల (దూరద ర్శిని) సహాయముననను జూడనేరము. ఇట్టి వానిని నిర్మించు పదార్థము (ఈశ్వరుడు) అతి సూక్ష్మము నిరాకారము నగుటలో సందియమేల? అందువలన నీశ్వరుడు నిరాకారుడు సర్వవ్యాపకుడు గావలసియు న్నాడు. అతడు పరమాణువులందును వ్యాపించియున్నాడు. పువ్వుల లోనున్న రంగులను మీరు చూచియుందురు. ఎంత సూక్ష్మ రచన! చిత్రకారుడు తనయతిసూక్ష్మమయిన కుంచెతో కూడ అట్లురంగు వేయజాలడు. నిరాకారుడయిన యీశ్వరుడే యిట్టి కార్యములందు సమర్థుడు. దీనినిబట్టి యీశ్వరుడు నిరాకారుడు సర్వవ్యాపకుడు సర్వజ్ఞుడునని తెలియుచున్నది. అతడు ఘటఘట వ్యాపి. సర్వ శక్తిమంతుడు. శక్తిలేకున్న కార్యమెట్లు జరుగును? ఈ పదార్థమునే యొకానొక యుపనిషత్కారుడెట్లు సుందరముగా వర్ణించియున్నాడో పాఠకులు గమనింతురుగాత.

"న తస్యకార్యం కరణంచ విద్యతే
న తత్సమశ్చా భ్యధికశ్చదృశ్యతే,
పరాస్యశక్తిర్వివిధై వశ్రూయతే

స్వాభావికీజ్ఞాన బలక్రియాచ

తమాహు రగ్ర్యం పురుషం మహాంతం

అపాణిపాదో జవనోగ్రహీతా

పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః

సవేత్తి వేద్యం నచతస్యాస్తి వేత్తా" ఇత్యాది

(2) ఈశ్వరగుణములు మారునా? అనగా నీశ్వరునియందు మార్పులు గలుగునా యని తాత్పర్యము. సర్వవ్యాపకు డేక దేశి కాగలడా? సృష్టియందుకల పదార్థములన్నియు మార్పులు నొందు చుండును. వీనిలో నీమార్పులేర్పడుటకు ముఖ్యకారణ మీశ్వరుడే. కాని కొన్నిపట్ల మానవులును నీశ్వరానుకూలముగా పదార్థములను మార్పగలుగుదురు. ఎట్లన కొయ్యనుమార్చి బల్లలను కుర్చీలను మరియు నితర వస్తువులను నిర్మించుచున్నారు. ఇట్లే సువర్ణమును కుండలాదుల నొనర్చుచున్నారు. కాని యీశ్వరుడు మాత్రము మార్పునొందువాడు కాడు. ఈశ్వరునిలో మార్పుగలిగిన నతనియందు నిర్బలత యేర్పడును. ఈశ్వరగుణములలో మార్పేగలిగిన నతడీ శ్వరుడేకాడు. నిరాకారుడు సాకారుడైనచో నతనియందు స్థూలత యేర్పడును. స్థూలత యేర్పడుటతోడనే సర్వవ్యాపకత నశించును. స్థూలపదార్థము సూక్ష్మవస్తువులందెట్లుండ గలదు? వ్యాపకత నశిం పగానే జ్ఞానము నందును కొఱత యేర్పడును. అందువలన నీశ్వరు డెన్నడును మార్పునొందదు. ఈశ్వరునిలో మార్పుచెందుటకు కార ణము ఈశ్వరుడేనా? అన్యాలా? స్వయముగా నతడుమారిన నతని యందేదోయొకదోషము అపూర్ణతయుండి యుండవలయును. పూర్ణ వస్తువెన్నడును మార్పునొందదు. పూర్ణపదార్థమపూర్ణమగునా? ఎన్నడును కాజాలదు. కాబట్టి యీశ్వరునందేవిధమయిన న్యూన తయు లేదు. అతడు మార్పునొందదు. ఈశ్వరుని మార్పున కన్య పదార్థము కారణమందుమా? కాదు. ఎందువల్లనన, నొకవస్తువును మార్పునొందించు వస్తువు దానికంటె బలవంతమైయుండవలయును.

ఈశ్వరునికంటె బలమగు వస్తువు మరియొకటిలేదు.

'నతత్స మశ్చాభ్యధికశ్చ దృశ్యతే'

అట్టిచో నీశ్వరునిలోని మార్పున కన్యవస్తువు కారణమన నెట్లు చెల్లును? కొంతమంది ఈశ్వరుడు సర్వశక్తిమంతుడగుటచే నతడు మారగలడందురు. పాపము ! వీరికి విచారించు శక్తిలేదని తోచు చున్నది. ఎట్లన, సర్వశక్తిమంతము కాని పదార్థము మార్పుచెం దగలదు. మార్పుచెందుట శక్తిమత్తతకు చిహ్నమేకాదు. అదినిర్బ లతా చిహ్నము. ప్రబల వస్తువులను మార్చుచుండును. కాబట్టి యీశ్వరుడు సర్వాధిక సంపూర్ణ బలుడగుటచే నితరపదార్థములను మార్చుచుండును. అతడు స్వయముగా నఖండుడు నిర్వికారుడు నేకరసుడు నైయున్నాడు. మార్పునొందువస్తువు మార్పునొందుటకు పూర్వమున్న స్థితికంటె మంచిస్థితికో చెడ్డస్థితికో వచ్చును. ఈశ్వ రుడు తానున్నస్థితికంటె మంచిచెడుగు స్థితులలో నెన్నడు మార్పు నొందువాడుకాడు. అపూర్ణవస్తువు నిండింపననువగును. పూర్ణము నెట్లు పూరింపగలము?

(3) ఈశ్వరుడిట్లపరివర్తనశీలుడై యుండ అవతారమెట్లుసిద్ధిం చును. మార్పునొందని వస్తువు అవతరింప జాలదు. ఈశ్వరుని యందు మార్పుగలుగ వీలులేదని పైనవర్ణించి యుంటిమి. కాబట్టి ఈశ్వరుడవతరింపజాలడు. ఈశ్వర కార్యములయిన సృష్టిస్థితిలయ ములు ఈశ్వరునిలో మార్పు నపేక్షింపకయే జరుగును. జరు గుచున్నవి. అందువలన నీశ్వరునకు జన్మించవలసిన యవసరము కనిపింపదు. దుష్టులను శిక్షించుటకును, శిష్టులను రక్షించుటకు నీశ్వరుడవతరించు నందురు. ఈశ్వరుడు జన్మించకున్న దుష్టు లను సంహరించుటకును శిష్టులను సుఖులనొనర్చుటకును సమ ర్థుడు కాడా? యనివారినడుగ వలసియుండును. కంసరావణాదులను సంహరించుట సూర్యచంద్రాద్యనంత పదార్థముల నిర్మించుటకంటె కఠినమా? కంసరావణాదులకు జన్మలనొసంగినదెవరు? ఈశ్వరుడు

వారిని నిర్మించలేదా? వారిని జన్మింపజేయుట కవతరించని ఈశ్వరుడు సంహారింప నవతారధారణ నేలచేయును? జన్మింపజేయుట కంటె వస్తువును - నిర్మించుటకంటె - చంపుట - చెడగొట్టుట అతిసులభము. సాధారణ మనుజులు గడియారమును నిర్మింపజాలరు. కాని ప్రతిబాలకుడు దానిని చెడకొట్ట సమర్థుడు కాగలడు. ఇంతియకాక, నేడీశ్వరుడు దుష్టులను సంహరించుటలేదా? చంపకున్న వారందరు నమరులుగారా ! ఈశ్వరుడు భక్తుల హస్తముల నున్నాడని కొందరెంచు చుందురు. భక్తులు కోరిన రూపమున భగవానుడు వారికి దర్శనమిచ్చునని వారి యభిప్రాయము. ఇదియంతయు ప్రమాదము నిజమారయ, ఈశ్వరుని నియమానుకూలముగా నడచుకొనుటయే భక్తియనబడును. తనయిష్టమువచ్చినట్లెల్ల ఈశ్వరుని నటింపజేయుట భక్తికానేరదు. భక్తులకొరకీశ్వరుడు జన్మ, మరణములకులోనగు ననుటయు వారికొరకై వ్యభిచారాదులనొనర్చుననుటయు, భక్తులమూర్ఖతకంటె వేరుగానేరదు. యజమానుని అనువర్తించువాడు సేవకుడగునుకాని, తనకను సన్నలతో యజమానుని నడుపువాడు సేవకుడెట్లగును? అట్లే భక్తులు భగవానుని నియమముల ననుసరింతురుగాని భగవానుని తనయంగుళ్యగ్రముల నడుప నర్హులుకాజాలరు. కాబట్టి యీశ్వరున కవతరించ వలసిన యవసరముగానము.

(4) ఈశ్వరుడవతరించుట సంభవమా? ఈశ్వరుడవతరించు ననుట యీశ్వరు నవమానించుటగును. ఈశ్వరుడు కౌసల్యాదేవక్యాదుల గర్భమునందు వ్యాపించియే యుండెను. అతడు సర్వవ్యాపకుడు. అందువలన ఈశ్వరుడు కొండొక స్త్రీ గర్భమున నవతరించెను. నవమాసములు గర్భమునందుండి యనంతరము జన్మించెననుట మిగుల యవివేకతయగును. ఈశ్వరుడు చేయలేని కార్య మొందులేదని పలువురు తలంతురు. సర్వశక్తిమంతుడనగా వారియభిప్రాయమిదియే. కొన్ని పనులు చేయగలుగుటయే నిర్బలత యని వారెరుగరు. 'ఈశ్వరుడు నిర్బలుడు కాజాలడ'ని నేనందునేని నావాక్యమును తిరస్కరించు మూర్ఖులుండరనియెంచెద. ఈశ్వరుడు

నిర్బలుడుకాజాలడని యంగీకరించుటలో నెట్టిపాపమును గనిపించదు. ఎన్ని విధములయిన శక్తులున్నవో అవన్నియు నీశ్వరునందుగలవ నుటయే సర్వశక్తిమంతుడను శబ్దమున కర్థము. సర్వశక్తిమంతుడన సర్వకార్య కర్తయని యర్థముకాదు. ఈశ్వరుడు రామకృష్ణాది శరీరము లను ధరించి యటకార్యముల నాచరించునపుడు మిగిలినప్రపంచమున నెవరు కార్యముల నాచరించిరి? కాబట్టి యీశ్వరు డవతరించగలడు అవతరించుననుట అసంబద్ధ ప్రలాపములు మాత్రమగును.

(5) రామకృష్ణాదులు మహాపురుషులనుటలో నేరికి సందేహముం డదు. వారియందసాధారణ శక్తియుండెను. వారు చతురులు నేర్పరులునగుటయు నిజమే. కానివారినీశ్వరులనదగు విషయము వారియందేమియు గానరాదు. యోగదర్శనమున "క్లేశకర్మవిపాకా శయై రపరామృష్టః పురుష విశేష ఈశ్వరః" అన్నాడు పతంజలి మహర్షి. అనగా నీశ్వరునకు అవిద్యాది క్లేశములతోను, కర్మలతోను, కర్మఫలముల ననుభవించుటలోను ఎట్టిసంబంధము లేదని సూత్రాభి ప్రాయము. రామకృష్ణుల జీవనములలో నుత్తమమానవ చరిత్రము మాత్రము కనిపించును. వారిలో ధార్మిక భావముండెను. వీర్య శౌర్యాదులును జూడనయ్యెను. కాని వారెన్నడు సృష్టికార్యములందు పాల్గొనినట్లు కానరాదు. ఒక చిన్న చీమనుగాని దోమనుగాని సృష్టించి నట్లుకానము. ఇతరమానవుల వలెనే వారును అన్న పానములాచరిం చిరి. నిద్రామైథునములందును సమానులుగా నుండిరి. గార్హస్థ్యధర్మ ముల నాచరించిరి. సంతానమును బడసిరి. అవసరమువట్ల యుద్ధ ములందు శస్త్రాస్త్రముల నుపయోగించిరి. జయాపజయములకును లోనైరి. ఈకృత్యములన్నియు మానవజాతికి సంబంధించినవేగాని యీశ్వరునితో వీనికి నెట్టిసంబంధమును గానరాదు. రామకృష్ణా దులు ఈశ్వరులేగాని మానవలీలల నాచరించిరని కొందరందురు. ఇదియునొక యవివేకమనక తప్పదు. ఈశ్వరుడు మానవుని లీలల నాచరించుటకు జన్మించునా? మనుష్యులులేరా? ఇంతియగాక, మనుష్యలీలలనాచరింప యీశ్వరుడవతరించెననుటలో యర్థమేమి?

రామకృష్ణాదులలోను నితరమనుష్యులలోను నెట్టి భేదము లేదని యొప్పుకొనుట కాదా? అట్టితరి రామకృష్ణు లీశ్వరు లెట్లగు దురు? కొందరు కృష్ణుని వెన్నదొంగిలించుట యందును, మురళి మ్రోగించుటయందును ముగ్ధులగుచున్నట్లు మిథ్యాభక్తిని జూపుచుం దురు. శామీశ్వరు నుపాసించుచున్నట్లు నెంతురు. క్రైస్తవులు నిట్లే క్రీస్తును శూలారోహణ మొనర్చినపుడు మరణించి తదు పరి మూడుదినములకు మరల బ్రతికి శిష్యులకు దర్శనోపదేశాదుల నొసంగినట్లెంతురు. కాని యీకృత్యములన్నియు సాధారణ మాన వులవని యీయమాయికు లెరుగరు. వీనియందు నీశ్వరత్వమును సూచించు కృత్యములేవి? సాధారణముగా చంచల బాలురెల్లరు వెన్నను తినుబండారములను దొంగిలించుచుందురు. మురళీనాదము నొనర్చుచుందురు. అపరాధులయిన మనుజులకే శూలము నధిరో హించ వలసిన స్థితి యేర్పడును. ఈశ్వరునికీకృత్యములతో నేమి సంబంధమున్నది? కాబట్టి రామకృష్ణాదులు మానవులేగాని యీశ్వ రులు నీశ్వరావతారములు నెన్నడునుగానేరరు.

(6) రామకృష్ణాదుల నీశ్వరులని భావించినందువలన హిందువుల యాచారవిచారములందు యనర్థము వాటిల్లినది. ప్రథమానర్థము మూర్తిపూజ. హిందువులలో నవతార వాదమువలన మూర్తిపూజ వ్యాపించినది. రామ రామ సీతారామ-రాధేశ్యామ-రాధేశ్యామ యని జపియించుటే యీశ్వరపూజయయినది. రెండవ యనర్థమేమన, హిందువులు రామకృష్ణుల చరిత్రము ననుసరింపక వారు దేవుళ్ళని భావించి యాచరణ మానవాసాధ్యమని యెంచుచున్నారు. హిందూ జాతి పతనమునకిదియే కారణము. హిందూజాతి తన దుఃఖము లను దూరమొనర్చుటకు యత్నింపక దేవునిపై నాధారపడి యతని యవతారము నెదురు చూచుచున్నది. ఈశ్వరుడవతరించి తనకష్ట ములను పోనాడునని హిందువులు తలచుచున్నారు. హిందువులలో తమకర్తవ్యములను గుర్తించు శక్తి నశించినది. ఈశ్వరుడు తమ పురుషార్థమునకు ఫలరూపమున సహాయకుడగునను విశ్వాసమిపుడు

వారియందు గానరాదు. ఇప్పుడు కల్కి అవతారమునకై ప్రతీక్షనొన రించుచున్నారు. కొందరి దృష్టిలో కల్కి యుత్పన్నుడై ఎక్కడనో పరశురాముని దగ్గర విద్యాభ్యాసము నొనరించుచున్నాడు. ఈరు వివేక విచారములను వీడి రామకృష్ణాదులు మనుజులే వారివలె మనము నుత్తమ కార్యముల నొనరింపగలమను విశ్వాసము హిందు వుల హృదయముననున్న నేడు మరల సుఖ సంపదల ననుభవింప గలుగుదురు.

(7) వేదములయందు రామకృష్ణాద్యవతారముల వర్ణనలున్నవా? వేదములందు రామకృష్ణశబ్దములుండుటలో సందియములేదు. కాని రామకృష్ణులవతారపురుషులని వర్ణించినట్లెక్కడను కాననేరము. వేద ములందట్లు వర్ణింపననుచెద్ది? రాముడు త్రేతాయుగమువాడు. కృష్ణుడు ద్వాపరాంతము వాడు. వేదములు సృష్టిప్రారంభమున ప్రకా శింపబడినవి. నేటికెన్నో చతుర్యుగములు కడచియుండును. రామకృ ష్ణాదుల తాతముత్తాతలును వేదముల నధ్యయనముచేసి వేదోక్త ధర్మ ములను పాలించియుండిరి. వేదములందెక్కడను దశరథ పుత్రుడు రాముడనిగాని, వసుదేవపుత్రుడు కృష్ణుడనిగాని, వారిజీవిత వర్ణనలు గాని మనము జూడనేరము. రామకృష్ణ ఆది శబ్దములున్నంతమా త్రమున వేదములందవతార వర్ణనలున్నట్లెంచువారు స్వయముగా వంచింపబడుటయేగాక యితరులను వంచించుచున్నారు. దశర థాదులు తమబిడ్డలకు లోకవేదములందు ప్రచలితశబ్దములనే నామ ములుగా నుంచియుందురు. ప్రస్తుతము తల్లిదండ్రులు లోకమున వాడుకలోలేని శబ్దములను నామములకొరకు కల్పించుటలేదుగదా? ఒకని పేరు 'మోహనుడు' అని యెంచుడు. ప్రాచీనశబ్దకోశము నందు మోహకార్థక మోహనశబ్దముండుట జూచి తన వర్ణనయే యాకోశముననున్నదని వాదెంచునేని మూర్ఖతగాక మరియేమగును? లోకమున సంస్కృత భాషల నాడు వారినామములు సంస్కృత శబ్దములకు సంబంధము గలవై యున్నచో నట్టిశబ్దములు వేదము లందు దొరకకపోవు. అంతమాత్రమున ఆయానామములు గలవారి

వర్ణనలన్నియు వేదమున నున్నట్లేనా? వేదమంత్రములందెక్కడను 'రాముడుదశరథపుత్రుడు అతడీశ్వరావతారము కాని మానవలీలల నాచరించుచు సీతను వివాహమాడెను - అరణ్యమునకేగెను' - అనునిట్టి వర్ణన గనిపింపదు. శ్రీ సాయణాచార్యాదులును వేదము నందాయా తావుల గనుపించిన రామాది శబ్దములకు అంధకారాది అర్థములనే వ్రాసియున్నారు. నేడు కొందరుపండితులు అవతార సిద్ధికొరకాయా మంత్రములకు క్లిష్టకల్పనలద్వారా విరుద్ధార్థములను కల్పింపయత్నించుచున్నారు. కాని వారీయత్నములన్నియు నిరర్థక ములే. సఫలులెట్లుకాగలరు? రామశబ్దము గల మంత్రమొకటి క్రింద జూపుచున్నాడ జూడుడు.

"భద్రోభద్రయాసచమాన ఆగాత్స్వసారో అభ్యేతి
పశ్చాత్ సుప్రకేతైర్ద్యుభిరగ్నిర్వితిష్ఠన్నశద్భవథరధి
రామయస్థాత్" సామవేదః ఉత్తరార్చికా.12-5-3

ఈ మంత్రమున రామశబ్దమున్నది. సాయణాచార్యుడీ శబ్దము నకు "రామమ్ కృష్ణం శార్వరంతమః" రాత్రియందలి నల్లని చీకటి అని యర్థము వ్రాసియున్నాడు. కాబట్టి సాయణునిదృష్టిలో వేద మున రాముడవతారమని యున్నట్లు తెలియదు.

వాస్తవమున రామకృష్ణాదులు ఈశ్వరులుగాని, ఈశ్వరావతా రములుగాని కాదనిరుజువు చేయుటకు వారిచరిత్రములే చాలినంత సాక్ష్యమొసంగగలవు. వాల్మీకి రామాయణమునందు మున్ముందు నారద వాల్మీకుల ప్రశ్నోత్తరములను తిలకించిన రాముడు నరుడ నుట సుస్పష్టము.

" కోన్వస్మిన్ సాంప్రతం లోకేగుణవాన్..........
...............జ్ఞాతుమేవం విధం నరమ్" వా.రా.

ఇంతియగాక రామకృష్ణాదులు సాయంప్రాతః సంధ్యాదులనొన రించినట్లు చూడనగును. స్వయముగా వారీశ్వరులయిన మరెవరిని ధ్యానించిరి? ఇటీవలననేకులు రామాదుల విషయములందనేక కల్పి

తగాధలనల్లిరి. వారిమూర్తులను కల్పించి పూజలనారంభించి పొట్ట పోసికొన నారంభించిరి. విచారకుల కీప్రక్రియలు విచారములు హీన తమములని తోచకపోవు. వస్తుతః యీశ్వరుడవతరించడు. అనగా శరీరమును ధరింపడు-జీవులు శరీరమును ధరింతురు. అనగా నవత రింతురు, చీమలు, దోమలు, పిల్లులు, కుక్కలు, గజములు, గుఱ్ఱ ములు, మనుష్యులు మున్నగు నవన్నియు జీవుని యవతారములు. జీవుడల్పశక్తిమంతుడు. అతడు తనకార్యముల నొనరించుటకు కర్మల ఫలముల ననుభవించుటకు శరీరముల నాశ్రయించును. ముక్తిని పొందువరకు జీవులు శరీరములందవతరింతురు. అతని కర్మలెంత నికృష్టములగునో అంతనీచమగు నవతారములతనికి గలుగును. ఎందు వల్లనన అవతారమునకు క్రిందికి దిగుట - పడుటయని యర్థము. అభౌతిక చేతనజీవుడు భౌతిక జడశరీరమున దిగినపుడు అతడ వతరించును. ఇంతమాత్రమున నవతారము సిద్ధించినదికదాయని భావింపకుడు. ఈ జీవావతారము లుపాసనా యోగ్యములు కావు. ఈశ్వరుడొక్కడే యుపాసనాయోగ్యుడు. అతడునిరాకారుడు. అజ న్ముడు. నిర్వికారుడు. అందువలననే వేదములందు "అజఏకపాత్" అని వర్ణింపబడియున్నది. అట్టి యీశ్వరునుపాసించుటయే మాన వకల్యాణమునకు హేతువగును. రామకృష్ణాదుల నైతిహాసిక పురుష లుగానెంచి వారి చరిత్రములను పఠింపుడు - వారియుత్తమ చరిత్ర ముల ననుసరింపుడు. వారిమూర్తులనునిర్మించి యీశ్వరస్థానమున పత్రపుష్పముల నర్పించి యీశ్వరోపాసన నొనరించితిమని ఆత్మవం చనకులోనుగాకుడు. ఆర్యులారా ! యీశ్వరస్థానమున మరియొకని పూజించుట పాపమగును. పాపాచరణ శ్రేయస్కర మెట్లగును? విచారశక్తిని వినియోగించి శ్రేయోమార్గముల నధిగమింపుడు. అశు భంకర విచారములను ఆచారములను విడనాడి శాశ్వత సుఖము ననుభవింపుడు.

# పండిత గోపదేవ్

జననము : క్రీ.శ. 1896 మరణం : 1996

జన్మస్థలము : కూచిపూడి, తెనాలి తాలూకా

జననీజనకులు : శ్రీ అంబమాంబా రామయార్యులు

విద్యాభ్యాసము : కూచిపూడి,అమృతలూరు, కాశ్యాదిపీఠములు, సంస్కృతాంధ్ర హిందీ సాహిత్యములు

అభిమాన విషయములు : షడ్ దర్శనములు, నైష్ఠిక బ్రహ్మచర్యము, యోగమార్గ ప్రావీణ్యము

స్థాపకులు : అంబా దర్శన గ్రంథమాల, కూచిపూడి,అంబా రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు, సికింద్రాబాద్ మరియు ఎన్నో ఆర్యసమాజములు

సన్మానములు :

1. "కళాప్రపూర్ణ" - ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్టణం
2. రూ. 10,000/- **"మహర్షి దయానంద సరస్వతి నిధి పురస్కార్"** న్యాస్, ఆర్యసమాజం, పులేరా
3. రూ. 5,001/- ఆర్యప్రతినిధి సభ, ఆంధ్రప్రదేశ్, సుల్తాన్ బజార్, హైదరాబాద్.
4. రూ. 25,000/- **వేదవేదాంగ పురస్కార్,** ఆర్యసమాజము, శాంతాక్రూజ్, బొంబాయి
5. రూ. 1,00,000/- శత జయంతి సందర్భముగా **"దర్శన తత్త్వవేత్త"** బిరుదు - శతజయంతి ఉత్సవసమితి, సికింద్రాబాద్. తేది. 30-7-1995

**రచనలు,అనువాదములు** : సత్యార్థ ప్రకాశము,ఋగ్వేదాది భాష్యభూమిక, నిరుక్తము, ఋగ్వేద భాష్యభాస్కరము I,II,III, వైదిక వినతి I,II, వైదిక దినచర్య, న్యాయ మొ॥ 5 దర్శనములు,ఈశ, కేన మొ॥ 11 ఉపనిషత్తులు, ఆస్తికవాదము, అర్థధర్మ మీమాంస, సంస్కారవిధి, భగవద్గీత, ఏసుక్రీస్తు రహస్య జీవనము, పూజ, వైదిక పర్వ పద్ధతి, అపశూద్రాధికరణము మొదలగునవి చిన్న గ్రంథములు 25 (నాలుగు భాగాలలో) చిన్నవి,పెద్దవి కలిపి ఆఋవదికి పైగా వైదిక గ్రంథములు తెలుగులో రచించినవారు వీరొక్కరె.

Amba Darshana Grandhamala

# AAVATAARA MEEMAMSA

Rs. 6/-



మహర్షి దయానంద సరస్వతి
(1824-1883)

ప్రతులకు :

1. అంబా దర్శన గ్రంథమాల
ఆర్యసమాజము
కూచిపూడి, తెనాలి తాలూకా,
గుంటూరు జిల్లా. 522 313.
(ఆం.ప్ర.)
ఫోన్ : 08644-252789

2. మాశెట్టి శ్రీనివాస్ ఆర్య
నెం. 5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 నుండి 740,
కంచరిబజార్, సికింద్రాబాద్ - 3.
(తెలంగాణ)
ఫోన్ : 6632 0200